శ్రీ

# సప్తగిరీంద్రవాస శతకము

"ద్ర" ఏకప్రాస

భక్తిరస భరితము



| |
|---|
| శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారి<br>ఆర్థిక సహాయము వలన ముద్రించబడినది. |

1986

రచయిత :

పైడిపాటి మల్లన కవి

మూల్యం : 3-00 రూపాయలు

ప్రథమ ముద్రణ 1000 కాపీలు
1986
(సర్వస్వామ్యములు గ్రంథకర్తవే)

ముద్రణ :
కె. ఆర్. ప్రింటర్సు — నెల్లూరు

కాపీలు దొరుకుచోటు :
పైడిపాటి మల్లన కవి
డోరు నెం. 22/53 (0)
ఏ. సి. నగర్ - నెల్లూరు - 524 001
లేదా
కృష్ణా అండ్ కంపెని
పబ్లిషర్సు బుక్ సెల్లర్సు మరియు స్టేషనర్సు
ట్రంకురోడ్డు — నెల్లూరు

# ముందుమాట



అల్పజ్ఞుడనగు నేను ఎలిమెంటరీ పాఠశాల ఉపాధ్యాయుడను. నా బిడ్డలకు ఉద్యోగములు రాలేదనే బాధయున్నూ, కవులకు సైతమగు దారిద్ర్యపు బాధయున్నూ, యింకా నితరబాధలున్నూ ముప్పిరిగొన, భరించలేక వేదనగలిగినది. ఆవేదనలోని కన్నీటిధారయే కవితా స్రవంతియై జాలువారినది.

పిమ్మట సప్తగిరీంద్రవానునారాధించి పద్యములు వ్రాసినాను. ఎట్టకేలకు తొంబదియారు పద్యములు వ్రాయునరికి నా యిద్దరి బిడ్డలకు ఉద్యోగములు వచ్చినవి.

తక్కిన బాధలుకూడ పోవునని శతకమును పూర్తిచేసితిని. కేవలము వాడుక భాషలో ఈ రచన సాగినది. రామకృష్ణలీలల నిందరి వర్ణించితిని. ఇందేమైన దొసగులున్న ప్రాజ్ఞులు మన్నింతురుగాక.

ఇట్లు
గ్రంథకర్త

# కృతజ్ఞత



నా యీ "సప్తగిరీంద్రవాస శతకము"– అనే కృతిపై అడిగిన వెంటనే అభిప్రాయము వ్రాసియిచ్చిన మద్గురువర్యులు సాహిత్యభూషణ, విద్వాన్ శ్రీ నవ్వులూరి మాలెకొండయ్య పంతులుగారికిని. మరియు నాయీ కృతిని తిరుమల తిరుపతి దేవస్థాన కవిపండితాదులచే సమీక్షించబడిన తరుపరి దీనిని ముద్రించుటకు ఆర్థికసహాయముచేసిన దేవస్థానము వారికిని. ఈరచనలో నాకు చేదోడు వాదోడుగా సహాయపడిన విద్వాన్ శ్రీ పైడిపాటి నరసింహారావుకును. సర్వాంగ సుందరముగ నచ్చువేసియిచ్చిన కె. ఆర్. ప్రింటర్సు వారికిని. మరియు వారి సిబ్బందిని నా కృతజ్ఞతాభివందనము లర్పించుకొనుచున్నాను.

ఇట్లు,

గ్రంథకర్త

# పీఠిక

పాఠక మహాశయులకు ఒక మనవి!

[ఈ నామనవి ఓపికతో చదువుకొనవలెనని ప్రార్థన]

కవిత్వమనేది బలవంతంజేస్తే వచ్చేది కాదు. దానంతటది హృదయంలో బుట్టి జాలువారే సెలయేటి యూట. నిసర్గ శోభితమైన బాటవెంట పయనించి పాఠక పాంథుల దప్పితీర్చే యొక మంచి తేటయైన కళ.

కొండపై నుండి క్రిందికి దూకే సెలయేటినాపే శక్తి యెవరి కున్నది? వంకర టింకరగా క్రిందికి దూసుకొని రావడమే దాని పని. అంచుల జేరి దాని వయ్యారాన్ని తిలకించి ఆనందించడమే పాంథుల పని

కొందరు సేవింపజాలక మడిగట్టుక కూర్చుంటే అది వారి యదృష్టం అంతే. పండిత కవుల బాట వేఱు. భక్త కవుల దారి వేరు. చేతికి లోభాగము యొకటి. వెలి భాగము యొకటి. రెండూ చేరితేనే చేయౌతుంది. వేరుచేయాలని చూస్తే అది పిచ్చివారి పనిగా తోస్తుంది.

వేవునానమున్ను వేళానికొక కవి
యిప్పుడూరనూర యింట నింట
పదుగురాగ్గ శేగ్గురెనమండ్రు తొమ్మండ్రు
పదుగురేకి కవులు పద్మనాభ!

—అని

వాపోయినాడొక చాటు కవి. అది వాని కడుపు కుట్టు స్వభావమని కొందరనుకున్నది। అర్థంకాని అయోమయ మార్గాన సంద్రాక్ష్య దొర్లించి వ్రాసే కవిత్వాల కంటే, సహజముగా దొరలిన కవిత్వం ఎంతో కమ్మదనంగా యుంటుందని పెద్దలంటారు. నా అనుభవం కూడాను.

ఇక వ్యాకరణాలు, శాస్త్రాలు ఉండనే వున్నాయి. వ్యాకరణం దొక త్రోవ, కవిత్వమొక త్రోవ అన్నారు తిరుపతి వేంకట కవులు. వాటి త్రోవలు వేరు. వాటిని సహజ కవుల ధారాశక్తి నియమోల్లంఘన చేసుకొంటూ విశృంఖలంగా విహారం చేస్తుంది. అట్లని ప్రాచీన శాస్త్ర కవితోల్లంఘనం చేయు మూర్ఖుణ్ణని తలుస్తారేమో. శాస్త్రసమ్మత కవిత్వానికి శిరసావహిస్తాను. ప్రాచీనార్వాచీనోభయ రచనలు ఆనందంతో ఆహ్వానిస్తాను. ఉభయకవులకు నమస్కరిస్తాను.

"స్మిత జ్యోత్స్నాజాలం తవవదన చంద్రస్య పిబతాం"— అన్నారు సౌందర్య లహరిలో జగద్గురు శంకరులవారు.

మ॥ సతతంబున్ భవదీయ సుస్మిత ముఖాబ్జ జ్యోత్స్నఁ గ్రోలన్ జకో
రతతుల్ తీపి విశేషమై యరుచి తోరంబౌట ద్రక్షాద్యసం
గతిపాయన్ నిశఁబుల్లసీక్ష్ణనెడి శంకన్ జంద్ర మశ్చంద్రికల్
కుతికల్ నిండగ ద్రావు కావలి కళాగోళాంబికా! వాకృతీ!



అని పై శ్లోకానికి కమ్మగా ఆంధ్రీకరించినవారు, శ్రీ పరాల రామమూర్తి మహాకవులు, (రామకృష్ణ కంగోళ్ళమ్మ శతకం) నా యుభయులకే ఆశ్చర్యమును కలిగిస్తున్నారు. ఈ కాక సంగ్రహమే నాకు రసగా భావిస్తున్నాను.

ఇక ఈ మల్లన కవిగారిని గూర్చి ఆయన కవిత్వాన్ని గూర్చి క్లుప్తంగా మనవిజేస్తాను. ఆయన ఇంతకుముందు "ఉమామహేశ్వర శతకం" వ్రాశారు. బాగున్నదని పలువురచే మెప్పుకొందుకున్నారు. తదాక్షిణ్యం వలన ఉద్రేకంతో పద్యాలను శతంగ్రొక్కి చక్కగా వ్రాశారు. ఈ సప్తగిరీంద్రవాస శతకం యొక్క మకుటం శ్రీనాథ కవిగారి చాటువును చటుక్కున జ్ఞప్తికి తెస్తుంది చూడండి—

"కుల్లాయుంచితి కోకఁజుట్టితి, మహాకూర్పాసముం దొడ్గితిన్
వెల్లుల్లిన్ తిలపిష్టమున్ మెసవితిన్ విశ్వస్త వడ్డింపగా
బల్లాయంబలి ద్రావితిన్ రుచులు దోసంబంచు పోనాడితిన్
తల్లీ కన్నడ రాజ్యలక్ష్మి దయలేదా నేను శ్రీనాథుడన్"

ఇది పద్యం. ఇందు ఆఖరి చరణం చాయలో "తండ్రీ సప్తగిరీంద్రవాస దయలేదా నేను మల్లాద్యుతా"— అని కోరుగా వచించె. ఈ "సప్తగిరీంద్రవాస శతకం" "ద్రా" ఏకప్రాసలో 108 పద్యాలు నడిచాయి. ఇది చాలా దుర్ఘటమైన పని. అంటే ఎత్తైన కొండ నుండి నేలమీదికి అమాంతం దూకడం వంటిది. ఆపైనుండి క్రిందికి దూకే లోపల మధ్యలో గిరికీలు, ఫల్టీలు పర్యాన్ పీట్సు కొడుతూ వచ్చారు. నేలమీదికి చల్లగా దిగినారు. ఆ గిరగిరలో యెన్నెన్నో విరముల

ప్రవచించారు. అబ్బా! అనిపించారు; చూడండి— పుండరీకాక్షను - పుం(డ్రీకాక్ష; పూలదండలను — పూదం(డల్; తినండిరా — తిం(డ్రా కోదండరాముని — కోదం(డ్రామా యిలాగ వ్రాశారు. అయితే నేమి శ్రవణానందంగాను. ఘట వాయిద్యనాదంలా వినవస్తున్నాయి. మనస్సున కెక్కుతున్నాయి. ఇంకేమి గావాలి! చదివి సంతోషిస్తారని భావిస్తున్నాను.

ఇతను యింకను మంచి కవిత్వము వ్రాసి మన్నన పొంద గలరని ఆశిస్తూ. దీవిస్తూ. పండితులకు నమస్కరిస్తూ సెలవు తీసుకొనుచున్నాను.

శ్రీశ్రీశ్రీ

విద్వత్ కవిపాద సంవాహకుడు
సాహిత్య భూషణ
విద్వాన్
శ్రీ నవులూరి మాలెకొండయ్య పంతులు
కావలి - నెల్లూరు జిల్లా
14-4-1986

శ్రీ అక్షయ చైత్ర శుద్ధ



శ్రీ

## విఘ్నేశ్వరస్తుతి

అగజకుతనయుడపైతగు
నిగమంబుల. లోతెరింగి. నిర్మలమతివై
నెగడెడి గణనాథా! మా
కగణిత. విఘ్నములదొలచి హర్షమునిమ్మా!

## శారదాస్తుతి

జలజల సెలయేరుంబలె
గలగల పద్యములు వ్రాయ. గడగితి తల్లీ!
జిలిబిలి పలుకుల వెలదీ!
బలికింపుము. దివ్యమైన బల్కులు వెలయన్!

## గురు స్తుతి

మదిలోనదలచిబత్తిని
కుదురుగనవులూరి. మాలెకొండయగురునిన్
ముదమొదవ. నేనుతించెద.
సదమలమతి. శతకరచన. సాగుటకొరకై!

## అంకితము

లలితగతి. పైడిపాటి మల్లన్న కవిని.
దీనిరచియించి. భక్తసంత్రాణశీలు
డైన. సప్తగిరీంద్రున. కంకితమ్ము
చేసి. ధన్యోస్మియని సంత. సించినాడ!

శ్రీ

# సప్తగిరీంద్రవాస శతకము

## "ద్ర" ఏకప్రాస

## భక్తిరసభరితము

శ్రీం ద్రాం రాం అని చిత్తమందు విడిన్ సేవించినా తల్లినిన్
తంద్రిం గుర్వులకెల్ల మ్రొక్కులిడి శ్రద్ధా భక్తియుక్తిన్, తగన్
పంద్రెంద్రోజుల, నూరు పద్యములు, దెప్పంజాలితో దేవ! నా
తంద్రి! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్

అంద్రా ప్రాసము కొలకియ్యదగునా! అన్నారు, మోచర్ల, వా
రుంద్రా! ఓరి దుర్మాత్మకాయనుచమున్ పుద్దండమౌ భక్తి, నే
నంద్రా, ప్రాసమెబెట్టి చెప్పెదను, నాయయ్యా! నీకు దాసుండ, నో
తంద్రి! సప్తగిరీంద్రవాస! దయలేదా నేను మల్లార్యుడన్

తంద్రి! నీదు సమస్త సంపదలు, నీ ద్రవ్యంబు, నీ శక్తియున్
గాంద్రా నట్టి యఖండవైభవము, నీ కారణ్యమున్ జూపరా!
ఈం 'ద్రాం' పాత్రము, ముద్రణార్థమిడరా! ఈ కుండబోసీను, నా
తంద్రి! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్

తంద్రి! నీ శతకంబు జెప్పితిని, వృద్ధాప్యంబులోనుండి, నీ
యాంద్రుం బిడ్డలు, నీవు గూడుకొని, ద్రవ్యంబిందు, ముద్రించెదన్
వేంద్రంబందకు, జాగు సేయకుము: ఓ వెంకన్న! గోవింద! నా
తంద్రి! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్



తంద్రి! మాధవ! మత్స్యమూర్తివయి, బల్దైర్యంబుతో సోముకున్
పుంద్రా! వేదములం హరించితి పటంబున్ పోరి ఖండించిమున్
లేంద్రంబందెడి బ్రహ్మకిచ్చితి వియద్వేదంబులం శమ్ములన్
తంద్రి! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్

రాంద్రా! కొండనుబట్టి జిల్కెదమురారండంచు, మున్నీటని
ల్వాంద్రా! మీరని దేవదానవులు జిల్కన్, నీటిలో బ్రుంగ, న
ల్పాంద్రా! పూజలటంచు, ప్రార్థనలు సల్పన్ కూర్మమైకావవే
తంద్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్

గంద్రల్పుల్కుచు, చాపజుట్టినటులన్ గావించి, భూదేవి, నె
వ్వంద్రా! అద్దము, హేమ నేత్రునిలోవారి పగారంచు, బ
ల్గాంద్రల్గాయ, వరాహరూపమునమున్ ఖండించి తవ్వాని నా
తంద్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్.

తీంద్రంబందగమున్న. హేమకశిపున్, దీరోద్ధతిన్‌బట్టి, ఓ
రుంద్రా! యంచు, నృసింహరూపమున, నత్యుగ్రంబుతో, జీల్చినా
తంద్రి! బాలకు, నాదిభక్తవరుగా, ధన్యాత్మునిన్ జేయవే!
తంద్రి! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్

అంద్రన్ బిడ్డలబట్ట, శోకమున, నాహా! యందు, దేవేంద్రుడ
వ్వాంద్రన్ దీనుక వెళ్ళకావలకు, బాపాత్మున్ బలిన్‌బట్టి బల్
వేంద్రం బందగ, వామనుండవయిమున్ పీరోద్ధతిన్ ద్రొక్కవే
తంద్రి! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్

తంద్రిఁ జంపిన. కోపవేగమున గాదా. రాజులఁ దున్మిబల్
తీంద్రంబై. తగు గంద్రగొడ్డలిని. ప్రీతిఁబట్టి. రక్తంబుచే
తంద్రిన్ తృప్తిలజేయ. భార్గవుడవై. ధర్మంబు గాపాడవే
తంద్రి: సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్!

తంద్రి! కానలనేను బోయెదను. క్రోధంబేమియున్ లేదు. నె
వ్వాంద్రున్ సెప్పకుడడ్డమంచు, వనికిఁ వై దేహితోబోతి. క్రో
దంద్రా మాశ్యత నివు జంపితివిగాదా! రావణుఁ మున్ను. నా
తంద్రి! సప్తగిరీంద్రవాస! దయలేదా: నేను మల్లార్యుడఁ

రాంద్రా మీరని. కొల్వుకూటముకు బిల్వఁ బంచి మామయ్య. భత్
పోంద్రా: మీ పనిపట్టిజూతునని. నిప్పుల్ గ్రక్క. హుమ్మంచు బల్
గంద్రల్ గూసిన. కంసు జంపి ప్రజకుఁ కళ్యాణముఁ జేయవే
తంద్రి! సప్తగిరీంద్రవాసా! దయలేదా! నేను మల్లార్యుడఁ

పుంద్రాకోరులు నీచవర్తనులు లోభుల్ పచ్చిపాషండులఁ
గంద్రల్ బన్నెదు పాప వర్తనులు. లోకంబందునిండారన
వ్వాంద్రఁ. జంపి సుఖంబు నిచ్చితివిపో. బౌద్ధావతారుండవై
తంద్రి: సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడఁ

తంద్రీ! కేశవ! ముందు కాలమున బల్ ధైర్యంబుతో పాపులన్
కంద్రల్ జేయను. ఘోటకంబు పయిపేగఁ కత్తి చేబూని. వుం
డంద్రా! మీరని కల్కిరూపమున పేడ్కన్ నాశమున్ జేయవే
తంద్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మలార్యుడఁ



వేంద్రంబందుచు. వాసుదేవుడవు నీవెవ్వండురామూర్తి! నీ
వాంద్రన్ నిన్నును. మట్టబెట్టెదను. కాపాడంగలేరన్న. నా
పొంద్రున్ ద్రుంచిన రీలజంపుమిదె. నాపాపిష్టి దారిద్ర్యము
తంద్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేనుమల్లార్యుడన్

తింద్రా! బెట్టెదనన్న, బిడ్డలకు లేదేయంచువామాటయున్
వేంద్రంబంద. గుచేలుడున్ నినుతగన్ పేమారుసేవించి, పు
డంద్రల్ గైక్కొని పూజసేయకరుణఁ, దారిద్ర్యముఁ బాపవే
తంద్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడఁ-

తంద్రీ! నీవు దయా సముద్రుడవు కాదా! యైనదో వచ్చి, నా
వాంద్రఁ. నన్నును. బట్టియున్న, నరకప్రాయంపు దారిద్ర్య
కంద్రల్ జేయుము, మంగళంబులిడరా! కారుణ్యవారాంనిధీ!
తంద్రీ: సప్తగిరీంద్రవాస: దయలేదా! నేను మల్లార్యుడఁ

తంద్రి! కేశవ: గోగణార్తి హారణా! దారిద్ర్య విధ్వంసకా
తంద్రి: ద్వారకవాస! భక్తవరదా! దైత్యారి విధ్వంసకా
తంద్రి! నీరజనాథ! దాశరథి నాదారిద్ర్యముఁ బాపవే
తంద్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడఁ

గుంద్రాయిఁమును. నాతి జేసినది బల్ గొప్పందువేమో. హరీ!
బంద్రాయిఁబలె. నాదునెత్తిపయినఁ పద్మాసనంబున్న. యా
తీంద్రంబైన. దరిద్రదేవతను. రాతిఁ జేసినఁ. మెత్తునో
తంద్రీ! సప్తగిరీంద్రవాస: దయలేదా! నేను మల్లార్యుడఁ

తంద్రి కన్నడ సేయబోవకను. నా దారిద్ర్యమున్ బాపు. నే
వెంద్రిన్ ద్రావెద. నాపకున్న. నిక. నిన్నేమందునో యెంచుకో
పుండ్రీకాక్ష: దయానిధీ! గుణమణీ! మోదంబు చేకూర్చనా
తంద్రీ! సప్తగిరీంద్రవాస: దయలేదా! నేను మల్లార్యుడన్

తంద్రీ: నీవును. నీదు తమ్ముడును. సీతాలక్ష్మితోగూడి. కా
ట్టంద్రా: నాదు దరిద్ర దేవతను; కొట్టంచేతగాకున్న. నె
ట్టంద్రా! బైటికి. నెట్టలేనియడ. చుట్టంబౌనె. భక్తాళికన్.
తంద్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్

ఉంద్రా! నా మొరనాలకింపగదరా! ఓరోరి గోపాలకా:
తింద్రంబందుచునున్నవాడగదరా! ధీవర్య! నిన్నెప్డు. పూ
దంద్రల్ గైకొని. పూజజేసెదనురా! దారిద్ర్యమున్ బాపరా!
తంద్రీ! సప్తగిరీంద్రవాస: దయలేదా! నేను మల్లార్యుడన్

తింద్రంబందుచు. వేడుచుంటిగదరా: దిక్కెవ్వరున్ లేక. నా
తంద్రీ: పాపవినాశ! భక్తవరదా! ధ్యానించెదన్ వేగమే.
గుంద్రాయిం వడిబట్టి నెత్తిపయినంగొట్టండి దారిద్ర్యమున్
తంద్రీ: సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్

బంద్రాముండవ: కాకపోతే. మరినే పల్మారు ప్రార్థించి. పూ
దంద్రల్ గైకొని. పూజజేసినను. క్రోధంబేమి? నాలేమిడిన్
కంద్రల్ జేయవు? కారణంబు జెపుమా? కాపాడి రక్షింపుమా!
తంద్రీ! సప్తగిరీంద్రవాస: దయలేదా! నేను మల్లార్యుడన్



పుండ్రంబుల్ దరియించి కొండపయినన్. బొల్చారు నీయున్న. వె
ల్గొంద్రాయుండిల. మేలు! మేలు! భళిరే. గోవింద! వెంకన్న! యి
ల్లాంద్రన్. గూడి సుఖించునట్టి పనియేనా! నీకు. నెల్లప్పుడున్
తంద్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్

పంద్రీ: వాడవ: కాకపోతె చెపుమా! బంగారు కృష్ణుండవా!
కొంద్రాలందు. వసించునట్టి. హరియా! గోవింద: వెంకన్నవా!
పంద్రానట్టిపయోధిమధ్యనుండైవై. పాలించు. విష్ణుండవా!
తంద్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్

ఉంద్రా నట్టి యరణ్యమధ్యమున. యేవో. కొన్ని రాళ్లుండగా
గుంద్రాయైపడియున్న. కోమలిని. క్రోధంబేమియున్ లేక. కో
దంద్రాముండగు. నీవు జేసితివిగాదా! నాతిగామున్న. నా
తంద్రీ: సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్

తంద్రీ! దైవశిఖామణీ! గుణమణీ! దామోదరా: కేశవా!
తంద్రీ! మోహనరూప! వెంకటపతీ! తత్వాబ్ధి చంద్రోదయా!
తంద్రీ: పంకజనాభ పాపహరణా! దారిద్ర్య విధ్వంసకా!
తంద్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్

ఉంద్రా! నాపయినేల జెప్పవని. నీవుగ్రంబుతో. వేగ. కా
నీంద్రా! జూతుమటంచు. నిల్చితివ: ఓయీ! వెర్రి వెంకన్న! నీ
గాంద్రింపుల్ సడలించి. నా ధనములో కారాధ్య యిప్పించ వే
తంద్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్

రాంద్రా! కొండకు బోయిరావలయు. రారమ్మంచు. పిజుట్టు. ని
వ్వంద్రా! స్వామికటన్న. వెంట్రుకలు. దివ్యంబంచు. నీకిచ్చి. నా
తంద్రీ! బ్రోవుమటన్న. వారలకు. నిత్యానందముఁ జేయవే
తంద్రి! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్

దంద్రా! నీకిది. పూలమాలయిదుగో. దైత్యారి! విశ్వేశ్వరా!
పుండ్రీకోన్నతలోచనా! నరసఖా! భోగీంద్రపర్యంక! నె
వ్వాంద్రుఁ గోరని కోర్కెలా? చెపుమ! రావా! బ్రోవ! రాధాప్రియా!
తంద్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్!

ఉంద్రా! కేశవ! వారిజాతనయనా! యోరోరి దైత్యాంతకా!
తీంద్రంబందగనేల. నాపయిని. ప్రీతిన్ సర్వసౌఖ్యాల. ని
వ్వాంద్రా! మాధవ! గోగణార్తి హరణా! వాపోవుచున్నాను. నా
తంద్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్

కొంద్రాజుల్. మరి కోయరాజులును. సంకోచంబు లేకుండగా
పుంద్రంబుల్ ధరియించి, వచ్చెదరు బల్. మోదంబుతో బిక్షకుల్
వాంద్రం. బ్రోచినలీల. బ్రోవగదరా! వైరంబు నీ కేలరా
తండ్రి! సప్తగిరీంద్రవాస దయలేదా! నేను మల్లార్యుడన్

తండ్రి కేశవ! వెంకటాద్రి నిలయా! దామోదరా! శ్రీధరా!
తండ్రి నీరజనాభ! భక్తవరదా! దైత్యారి! విశ్వంభరా!
తండ్రి! పన్నగశాయి! పద్మనయనా! ధ్యానింబెదన్ నిన్ను. నా
ండ్రి! సప్తగిరీంద్రవాస! దయలేదా సేను మల్లార్యుడన్

కొండాద్రిలందున. నిల్చియున్న ఘనునిన్. గోవిందునిన్ జూడ. రా
రండాద్రి! పోద్రమటంచు. భక్తులిల. శైలంబెక్కి. వేంచేసి పూ
దండ్రల్ గైకొని పూజజేయ. ముదమందన్ నీవుగాపాడవే
తండ్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్

ఏంద్రా నాకిక దిక్కులేదుగదరా! యేమందు గోవింద! నీ
యాంద్రమ్. నీవును. నొక్కటౌచు. తగ. నన్నాశీర్వదింపంగదే
పుండ్రీకాక్ష! దయానిధీ! గుణమణీ! పాల్పారు లోకేశ్వరా!
తండ్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్

పోంద్రా! వేగమె. స్వామి వెంకటపతిన్ పూజింప. శేషాద్రి యె
క్కండ్రా! మీరనిబల్క. యాత్రికులు. శృంగారంబుగాబోయి. కా
నీంద్రా! యంచని పూజసేయ ప్రజలన్ నేర్పార. రక్షింపవే.
తండ్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్

కొండ్రాలందలికాననంబులకు. ముందుగొంపోయిరా గోవులన్
తీండ్రంబందగ. వహ్నిజుట్టుకొనగా. దిక్కెవ్వరంచున్. నినున్
దండ్రల్ గైకొని. పూజసేయువనిలో. దావాగ్నినిన్ మ్రింగవే!
తండ్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్

కొండ్రాలందున. నాలమేపుటకునై. గోపాలకుల్ వోవగా
బండ్రాలం. బలెరాల వానగురియన్. పద్మాక్ష! నిర్వేదగా.
రాండ్రా! మీరని చూచుచుండగనె. శైలం బెత్తికాపాడవే
తండ్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్

తింద్రారామయ! ఈ ఫలంబులను, నాతిద్యంబుగై కోర, శే
పుంద్రా! పోదువటంచు, నా శబరి, సంపూర్ణంబుగా వేడినన్
వేంద్రం బందకు, మేలుగల్గునిముగా, వేగంబుగా బల్కవే!
తంద్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్

తంద్రీ! మన్నుదినంగ నీకు తగునా! దండించెదన్ వేగ, ఓ
రుంద్రా! నీ పని పట్టిచూచెదనటంచున్ తల్లి కోపించినన్
తీంద్రంబందక, సర్వలోకములు ప్రీతిన్ నోటిలోజూపవే
తంద్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్

వేంద్రంబందుచు, నీటిలో నిలిచి, యావేదండ మొక్కండు, నా
తంద్రీ! నీరజనాథ! పాపహరణా; దైత్యారి! విశ్వేశ! నా
వాంద్రం, నన్నును, కావుమన్న, త్రుటిలో, పాలించి, కాపాడవే
తంద్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నునే మల్లార్యుడన్

గంద్రల్పన్నెడి, కౌరవాధములు, భోగాయత్తలై మత్తుతో
పుంద్రాకోయిలగూడి, ద్రౌపదికిమున్, పుట్టంబు, లూడ్చంగనే,
తంద్రీ! ద్వారకవాసా! బ్రోవుమనగా, దైత్యారి! రక్షింపవే
తంద్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్!

ఉంద్రా! సీత, నదేలదెచ్చితివి, నీవుగ్రంబుతో రావణా!
కంద్రజ్జేయగలాడు, రాముడనిలో, కాపాడలేరన్న, బల్
తీద్రంబంది, విభీషనున్ దరుమగా, ధీవర్య! కాపాడవే,
తంద్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్



అంద్రన్నిద్దల, పాపలన్వదలి, నాహోయంచు, పాపిష్టు, తె
వ్వాంద్రం బాదిన, లెక్కసేయని మహా పాపం దహించితివిన్
వేంద్రంబందక, మోక్షమిచ్చితివి, మున్ వేగంబె దైత్యారి! నా
తంద్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్-

దంద్రల్గంధము, చేతబట్టుకొని సౌరాగ్రంబునన్ కబ్జ వుం
దంద్రా! మీరనే రామకృష్ణులను, సుందంబొప్పగంధంబు, స్వా
దంద్రన్ గైకొని, కుబ్జతన్ దొలచి, సౌందర్యంబు మున్నిచ్చవే
తండ్రీ! సప్తగిరీంద్రవాస దయలేదా! నేను మల్లార్యుడన్

తంద్రిన్ దల్లినిబాసి, కానలకు, తన్ దైవంబెదికంచు, యో
ధుంద్రా! యన్నను, వెళ్ళి, నాధ్రువుడు, నెయ్యంబేసికాపాడవే!
తంద్రీ! యంచు తపంబు సేయ వనిలో, తబ్బాలు రక్షింపవే!
తంద్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్

గంద్రల్పుల్కుచు, నంబరీషు పయిబల్గాఢంబుగా, వైచె, యో
రుంద్రా! నీవని, శక్తి బాణమును, విప్రుండైన దూర్వాసుడున్
తీంద్రంబందుచు, నంబరీషుడును, ప్రార్థించన్, గనింబోవవే
తంద్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్!

తంద్రీ! వామన! వారిజాపగదరా! తంద్రీ! మహీజాధిపా!
తంద్రీ! శ్యామలరూప! వెంకటపతీ! తంద్రీ! జగన్మోహనా!
తంద్రీ! నీదునుదర్శ నాయుధముచేతన్, కష్టముల్ బాపరా!
తంద్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్!

తండ్రీ! నీకిదిచేలకాదనెదవా! దమోదరా! శ్రీధరా!
పుంర్రంబుల్లరియింపనేల, యిక నీ పూటోండ్లు, అల్వేలు మం
గాంధ్రం, గోరి భజించితీ రెదనులే! హా! సర్వలోకేశ్వరా!
తండ్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్

బంద్రాముందవ: నీవు! చాలునిక. నీపై ఆశయే తప్పు. లే
దంద్రా! యందము, యిచ్చినట్టిదెది, గానంరాదు యోచింప, నీ
యాందేర్రియత్తురు. సర్వసౌఖ్యములు, నేనంటిన్, నినున్ బాధచే
తండ్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా: నేను మల్లార్యుడన్

ఆంద్రఁ బిడ్డలనెట్లు సాకెదనునేనయ్యా! ననుఁగావ. నీ
ఆంద్రం నిన్నునుచాల వేడితిని, రావయ్యా! త్వరంబ్రోచి, యి
వ్యంద్రా! కోరిన కోర్కెలన్నియును. కోపంబేలనయ్యాయికఁ
తండ్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడఁ

వింద్రా! వామన! యేమిసేతునకటా! పీరుండవై యున్నచో
కొండ్రాలందువసింప కారణము, నాకుందెల్పుమిప్పట్టునఁ
వేంద్రం బందుచు, మాటలాడితినిలే! పేరేమియుఁలేదులే!
తండ్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్

పుండ్రీకంబుల, చంపకంబులను, సంపూర్ణంబుగా గ్రుచ్చి, పూ
దంద్రల్దీనుకవచ్చి, వేగనివియే రత్నాల హారాలు, కో
దండ్రామా! యని నీకునిచ్చి, ముదమొందఁ పూజగావించెదఁ
తండ్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడఁ



తండ్రిందల్లిని, నట్టెపోవిడిచి, సీతన్‌లక్ష్మణున్‌గూడి, యా
కొండ్రాలందలికాననంబులకు సంకోచంబు, లేకుండ, నీ
వాంద్రున్నారనికాదు; పోయినది, కాపాడఁ వడిఁ భక్తులఁ
తండ్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్

గాంద్రంచుఁ వడి బొబ్బరెప్పులుఁ, కస్సంచు సర్పంబులఁ
కాంద్రుల్లూసేడి రాక్షసాధములుగల్లన్, భీకరారణ్యముల్
ఉంద్రానట్టివి,సంచరించి, తుదకె న్నావయా! రాఘవా!
తండ్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడఁ

గంద్రాగొండిగ మాటలాడునని, చక్రంబంచు పశ్నింబుచే
కంద్రల్జేయను, రాజసూయమున, వేగం నీవు గూర్చుండియా
పుండ్రాకోర్మికుపాలు జంపితివిపో, పూజింతునెల్లప్పుడున్
తండ్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడఁ

కాండ్రావించుకయైన నీవనపు! లోకాలోకముల్ జూచినన్
ఐంద్రా వించుకయైన నీదు పలుకుల్వీణానినాదంబుగా
తింద్రా బెట్టెద పాలుబువ్వనిన, నాతిథ్యంబుగైకోవు, నా
తండ్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడఁ

తండ్రీ! జ్ఞానమొసంగుమయ్యా! గురునాథా! సర్వలోకేశ్వరా!
ఆంద్రున్ బిడ్డలు, బంధుమిత్రులిల, నత్తల్మామలాదేనుపుల్
ఉంద్రంచున్ మదిలో దలంచి యికనేనుందున్ సదా జ్ఞానినై
తండ్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా నేను మల్లార్యుడన్।

విండ్రా! మాధవ! నిన్ను వేడితిని. రావేలా! వడిన్ బ్రోవ. ఘ
దండ్రల్ గైకొని పూజసేయుదు మహాత్మా! తప్పకన్ మోక్షమి
వ్వండ్రా! జన్మతరించిపోవుగదరా! వైరంబు నీకేలరా!
తండ్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్

కొండ్రాలున్ మరికొన్ని వస్తువులు మున్ కోతుల్సహాయంబుగా,
బండ్రాలన్పడవైచి, సంద్రమువ, దేవా! సేతువున్గట్టితో
నుండ్రాలిస్కనుదెచ్చి, పోయునొక యుద్ధం, నీవు దీక్షించవే
తండ్రీ: సప్తగిరీంద్రవాస! దయలేదా: నేను మల్లార్యుడన్

తండ్రీ! పాండవులెంతలంచమిడిరో! ధైర్యంబుగా జెప్పు: మీ
వాండ్రేమిచ్చిరో! ఏనుగున్ శబరియున్ వైనంబుగా జెప్పు, మ
వ్వాండజ్రిన్ బోధించిన లీల. బోధించగదరా: వాదంబు నీకేలరా
తండ్రీ: సప్తగిరీంద్రవాస: దయలేదా: నేను మల్లార్యుడన్

పోండ్రా! మీకికలేదులే. భయము పోపోమ్మంచు నేమైనమీ
వాండ్రన్ మిమ్ముల్గా చితీరెదనులే. వాదంబు మీకేలన
వ్వాండ్రా: మీరనిచెప్పి. పాండవుల కాపాడంగలేదే. ప్రభూ
తండ్రీ: సప్తగిరీంద్రవాస: దయలేదా: నేను మల్లార్యుడన్

తండ్రీ! తారకమంత్రరాజమునన్, ధ్యానించి. పూజించి. పూ
దండ్రలొమ్మిది భక్తిమార్గముల చేతన్. వేగపూజించెదన్
బంద్రశ్రీవ వినరీతి, పాపముల వాపంజేసి, నన్నేలరా!
తండ్రీ: సప్తగిరీంద్రవాస: దయలేదా: నేను మల్లార్యుడన్



ఏండ్రా: నాపని యేమిజేసితివిరా! యేమందురా: శ్రీధరా!
వింద్రా: నీ మనసార విన్నపము! రావేరా! నన్ బ్రోవరా!
వాండ్రన్. పీండ్రనువోలె జూడకుమురా! వైరంబు నీకేలరా:
తండ్రీ: సప్తగిరీంద్రవాస: దయలేదా: నేను మల్లార్యుడన్:

ఆండ్రం బిడ్డల వాహనాల. మరియయ్యా వాసమున్ ఏడి. యా
ఓండ్రం బందలి పట్టణం బొకటి. పేరుండెన్ జగన్నాథ మం
దాండ్రన్. నీవును దారురూపమున. నాహ: జూడనెట్లుంటివో
తండ్రీ: సప్తగిరీంద్రవాస: దయలేదా: నేను మల్లార్యుడన్

తండ్రీ! నీ దయరాద నా పయిని, వృద్ధాప్యంబులో నుండి యె
వ్వాండ్రన్ నమ్మను. నిన్నె నమ్మెదను దేవా! భక్తియుక్తిన్ సదా
దండ్రల్ వైనిడి పూజజేసెదరా. బాధల్మన్పి నన్నేలరా:
తండ్రీ: సప్తగిరీంద్రవాస: దయలేదా: నేను మల్లార్యుడన్

వింద్రా! ఆ లినిగోలు పోతివనినే విన్నాను. భయమేమి లే
దుంద్రా: వాలిని సంహరించి బహు సమ్మోదంబుతో రాజ్యమున్
ఆంద్రన్ నీకు లభింపజేతునని. నిత్యానందమున్ జేయవే
తండ్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్!

తండ్రీ! వామన నీరజాతనయనా: దైతేయ విధ్వంసకా!
తండ్రీ! అంబుజనాభ: వెంకటపతీ! ధ్యానించెదన్ వేగమే
తండ్రీ: గోపికలోల! నాపయిని. వాదంబేల కాపాడుమో
తండ్రీ! సప్తగిరీంద్రవాస: దయలేదా: నేను మల్లార్యుడన్

ఉండ్రా! యర్జున నీకు సాయముగ నేనున్నానులే సారథై
కంద్రా! నాదు ప్రతాపమంతయును. నేకంగారు లేకుండరా!
తీంద్రం బందకు మేలుగల్గునని. మున్. ధీరోద్ధతిన్ బల్కవే
తండ్రీ· సప్తగిరీంద్రవాస: దయలేదా! నేను మల్లార్యుడన్

తండ్రీ! పాలను ద్రావుమంచు, ముదమందన్ నిన్ను వీక్షించి. యో
రుండ్రా! యిచ్చెదనంచు పాలగుడుపన్. ఓ! యంచు వెన్వెంటనే
గుండ్రె దెల్వ్రిలినసించె పూతన భళీ! గోవింద! నిన్ జేరదే
తండ్రీ! సప్తగిరీంద్రవాస: దయలేదా: నేను మల్లార్యుడన్

తండ్రీ! నీ వరహాల పెండ్లికయికాదా! యేమిలేకున్న. కా
నీండ్రా! డబ్బు.కుబేరునొద్దగొనుడీ. నిక్కంబుగా వడ్డి ని
వ్వండ్రా! యంచని పెండ్లియాడితివిపో. పద్మావతీదేవినిన్
తండ్రీ! సప్తగిరీంద్రవాస: దయలేదా: నేను మల్లార్యుడన్

పండ్రీవాస! దయానిధీ! రఘుపతీ: పాలించరా వేగమే
పుండ్రీకాక్ష! యధోక్షజా: మధురిపూ: పూజించెదన్ బ్రేమతో
దండ్రల్ గైకొని. మోక్షమియ్యగదరా: దండంబురా: శ్రీధరా:
తండ్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్

విండ్రా! యెంతనివిన్నవించెదనురా: వేగంబుగానేలరా:
వేంద్రంబందకనన్ను బ్రోవగదరా: వెంకన్న: గోవింద! పూ
దండ్రల్ గైకొని పూజజేసెదను, నీదాసుండరా: శ్రీధరా
తండ్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్



తండ్రీ! చీరెలు దొంగలింప. సతిసంతాపంబునన్ గోపికల్
యేండ్రా! చీరెలొసంగుమంచుబలుకన్: యేమందుమీరింక బె
ట్టండ్రమ్మా! తగదండమన్న. నటుపెట్టం నీవు కాపాడవే
తండ్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్

గండ్రల్గా. నరకాసురుండు. ప్రజలన్ గగ్గోలు గావింప. యో
రుండ్రా నివని. సత్యభామయును: నీవున్ యుద్ధముం జేసి. యా
పుండ్రా కోర్నరకాసురుండునిమి సమ్మోదంబుచే బ్రోవవే
తండ్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్

తండ్రీ: కంసునిబారికిన్ బడక. నింతప్పింప నీతండ్రి నీ
వుండ్రా గోకులమందు వేడుకను. నీవున్నన్ మోదంబొను. నా
తండ్రీ: యంచనిబల్కడించిచనగా దైత్యారి: నీవుండవే
తండ్రీ: సప్తగిరీంద్రవాస: దయలేదా: నేను మల్లార్యుడన్:

ఏండ్రా: యెంతటివాడవైతివిర: నీ యీడెంత. నీవెంత. మా
వాండ్రం రమ్మని. గుబ్బచన్నులను. యింపారంగబట్టన్. మహ
తీండ్రంబందెడి. గోపకాంతలకు. ప్రీతిన్ హాయిగల్పింపవే
తండ్రీ! సప్తగిరీంద్రవాస దయలేదా: నేను మల్లార్యుడన్

వేంద్రంబందగ. మున్ను నీవు మురళిన్. వేవేగ మ్రోగింప. యె
వ్వండ్రా: యాతడు. చిన్ని కృష్ణుడు సుమా: వద్దన్న నాగోపికల్
తీండ్రం బందగ వెళ్ళిపోయి కలయన్ ధీవర్య కాపాడవే
తండ్రీ! సప్తగిరీంద్రవాస: దయలేదా: నేను మల్లార్యుడన్

తంద్రిం జంపిన కోపకారణముచేతన్ ద్రౌణి శస్త్రాగ్నికిన్
వేంద్రంబందుచునుండు గర్భశిశువుం, వేగంబు గాపాడ, స
ల్పంద్రా: పూజలటంచు, వేడుకొనగా, పద్మాక్ష: కాపాడవే
తండ్రీ: సప్తగిరీంద్రవాస: దయలేదా! నేను మల్లార్యుడన్.

తండ్రీ! నీవు దయాసముద్రుడవుకాదా! ఐనా నా కష్టము
త్రిందగ్రింబౌనటుజేయ కారణమదేదీ! తెల్పుమిప్పట్టునన్
పుండ్రీకాక్ష: దయాంతరంగవినుమా! పూజించెదన్ వేగ నా
తండ్రీ! సప్తగిరీంద్రవాస: దయలేదా! నేను మల్లార్యుడన్

వింద్రా! ద్వారకవాస! పద్మనయనా! వేదాంత వేద్యా! హరీ!
కంద్రా! నా పడరాని కష్టచయముల్ ఖండించి, కాపాద ని
ల్వంద్రా! కత్తినిబూని, వెంకటపతీ! వైకుంఠవాస ప్రభూ
తండ్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్

ఆంద్రిం. నీవును. కీచులాడుకొని వహ్వా! శేషశైలానకున్
వేంద్రం బందుచువచ్చి చేరి. ప్రజలన్, వేగంబె మీరింక, తీ
ర్చంద్రా! మొక్కులటంచుచెప్పి దయతో, లాలించి పాలించవే
తండ్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్!

తండ్రీ! గోపెమ, త్రాటితోడనిను కాంతాళంబునన్ కట్టగా
దండ్రిగ్లాజని గోపకామినులు, నాథాయంచువాపోవగా
వేంద్రంబందక, ప్రేమతోడుతనుమున్ విశ్వేశ కాపాడవే
తండ్రీ: సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్



తండ్రీ! మామకు మామవై తిగద, సద్రంబందు జన్మించి, నీ
యాంద్రై. తల్లికిదల్లియైనరమ నిత్యానందమున్ జేయగా
వాంద్రం పీఠంను ప్రోచి, సర్వశుభముల్వర్షించి, కాపాడవే
తండ్రీ! సప్తగిరీంద్రవాస: దయలేదా! నేను మలార్యుడన్

రాంద్రా: బాలకులారపోదమని, బిల్వం, వారు విచ్చేయని
ల్వాంద్రా: మీరని చెప్పి కాళియుని బోరంబిల్చి యా నీటిలో
వేంద్రంబందుచు దూకి, వారలను వేగం బంపి కాపాడవే
తండ్రీ: సప్తగిరీంద్రవాస: దయలేదా! నేను మల్లార్యుడన్

కంద్రా! మాదవ! శంకుచక్రధర! నా కష్టంబులన్, వీనులన్
వింద్రా! కేశవ! వెంకటాద్రినిలయా! వెంకన్న! నాగాధలన్
వేంద్రం బందక, నన్ను బ్రోవగదరా! విశ్వేశ! వేవేగమే
తండ్రీ: సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్

వింద్రా! నీ నిలయంబు కొండలయినం వెంకన్న! వైకుంఠ మం
దాంద్రుం. నీవును గూడి, ఆలయములోనం, సౌధరాజంబు పూ
దంద్రల్పానుపుమీదనున్న గతిమోదం బొప్పగన్పించు. నో
తండ్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్

వింద్రా: నీగిరిచుట్టుపట్లగల ప్రాపీణ్యంపు తీర్థంబులున్
బంద్రాలుంబలె, గానిపించుచరియల్ బాగైన వృక్షంబులున్
వేంద్రం బందక హాయినిచ్చు సుమముల్ విఖ్యాతిగానుండు నా
తండ్రీ: సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్

కొంద్రల్మొరిరివాంత దబ్బుగలదో! గోవింద! రవ్వంత. నీ
అంద్రుం నీవును మాటలాడుకొని. నా యందున్ దయంజూపి. యి
వ్యంద్రా! కోరినయంత ద్రవ్యమును. వాదంబేల కాపాడరా
తండ్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్!

అంద్రాక్కైనె పెండ్లియాడగనె. నౌరా! యేమి నా కష్టముల్
అంద్రా! నీకు పదారువేలు గదరా! హా! బిడ్డలింకెందరో!
వేంద్రం బందక చెప్పవయ్య! యిది నీవేలాగు పోషించెదో.
తండ్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్

వింద్రా! యేన్మిదిమందిగాక పదహార్వేలందురే భార్య లీ
కొంద్రాలందు వసించు నీకు దగునా! గోవింద! వెంకన్న! నీ
యాంద్రున్నట్టి గృహంబులన్నిటను నౌరా! దెల్పుమెట్లుందువో
తండ్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్!

తండ్రీ! నీ పదమందు జేరుటకు. శ్రద్ధా భక్తియుక్తంబుగా
దంద్రల్గైకొని పూజజేసినినునే ధ్యానించెదం యింక. బ
రీంద్రదంబైనమదీయ బంధమును. నీలంద్రెంచి కాపాడుమో
తండ్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్

తండ్రీ! కొర్వలికెందుకయ్య! వినుమా. దండంబు. నా బిడ్డల
వ్యాంద్రం యిద్దరినీ వటుంచితివదే పాపమో. నౌకరి
వ్యంద్రా! వేగమె. జాగికేల చెప్పుమా! వాపోవుచున్నాను. నా
తండ్రీ: సప్తగిరీంద్రవాస: దయలేదా! నేను మల్లార్యుడన్



వేంద్రంబందుచు నుండజాలనిక. నస్వీకించి నా పాపము
ర్కొంద్రల్వంటివి. పారద్రోలి. వరదా! గోవింద! గోపాల. యి
వ్యంద్రా! మోక్షము. వెంకటేశ! వరదా! వైకుంఠవాస ప్రభూ
తండ్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా నేను మల్లార్యుడన్

తండ్రీ! తొంబదియారు పద్యములు. శ్రద్ధాభక్తియుక్తంబుగా
పంద్రెంద్రోజులలోపు వ్రాయగనె అబ్బ! యేమినాపట్టికిన్
దంద్రలేశ్వరి. నౌకరిచ్చిరి. యిదంతా సీదుదాక్షిణ్యమే
తండ్రీ! సప్తగిరీంద్రవాస! దయలేద! నేను మల్లార్యుడన్

ఉంద్రా! యేమని మొత్తుకొందువినరా! ఉద్యోగమేలేదు. కా
నీంద్రా! నా చినపిల్లలిద్దరికి. నిన్నేమందు ధ్యానించెదన్
గంద్రాగొండిగ మాటలాడగలనా! కాకున్నధ్యానించెదన్
తండ్రీ! సప్తగిరింద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్

బంద్రాముండవ! కాకయున్న. నిదిగో. పల్మారు ప్రార్థించి పూ
దంద్రల్ గైకొని పూజజేసినను. క్రోధంబేమి: నా కష్టము
ల్కంద్రడ్లేయవు? కారణంబు జెపుమా! కాపాడి రక్షింపుమా
తండ్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా: నేను మల్లార్యుడన్

తేంద్రా! కానుకలంచు. భక్తులను. హృద్వేగంబుగాబల్క. యే
మంద్రా! ఆయనకున్న మ్రొక్కులను. దృంపంరాదు. మీరింక. ని
వ్యంద్రా! కానులు వడ్డితో ననగ. నివ్వన్. బ్రోచికాపాడవే
తండ్రీ! సప్తగిరీంద్రవాస: దయలేదా! నేను మల్లార్యుడన్

తింద్రా! నైకొని పాలుమీగడలు బల్ తీపైన ఖాద్యాలు. కొ
దంద్రా ముందవ. వామనుండవ! ఔ! దైత్యారి! కృష్ణుండవా!
తండ్రీ! యంచని. స్తన్యమిచ్చెడి. యశోదాదేవికే మ్రొక్కెదన్
తండ్రీ! సప్తగిరీంద్రవాస దయలేదా! నేను మల్లార్యుడన్

వింద్రా! దేవకికేవి బిడ్డవయి నీ. విశ్వ ప్రభావాన. నీ
తండ్రే! దీసుకపోయిడింనెగదరా! దైత్యారి! వ్రేపల్లెలో
తండ్రిం బాసియెటుంటివయ్యా! యిక నీ తత్వంబు విన్పింపుమా
తండ్రీ! సప్తగిరీంద్రవాస దయలేదా! నేను మల్లార్యుడన్!

తండ్రీ! మాధవ! పాలు బువ్వాదిను. క్రోధంబేవి చన్నిచ్చెదన్
వేంద్రంబందకుమంచు. పాలనిడి మేనిన్ దువ్వి లాల్పోసి. నా
తండ్రీ! యేడ్వకుమన్న జోల, విని. నిద్రంజెందు బాబుండవో
తండ్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్

తండ్రీ! భావజరూప! పాపహర! తత్వజ్ఞానసంపన్న! ఓ
దుంద్రా. పాండవ పక్షపాతి! వరదా! ఓ గోపికాలోల! యి
వ్వంద్రా! మోక్షము. నిన్ను వేడెదను. దేవా! వేగరారా ప్రియా
తండ్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్

తండ్రీ! రాఘవ! గంగదాటుటకు. నీదాసుంగుహుంజేరవ్వం
దండ్రా! మీరని. పాదముల్గడిగివాడయ్యా! త్వరం ఓడ. యె
క్కంద్రా. పోదమటంచుబల్కు, యతనిన్ కాపాడి రక్షింపవే
తండ్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్

తండ్రీ! కాంచనచేలా! చక్రధర! వేదాధీశ! గోవింద! నా
తండ్రీ! కోమలదేహ! రాక్షసహరా! దండంబు లోకేశ్వరా!
తండ్రీ! నామొరనాలకించ, విధి, యేదౌష్ట్యంబురా! శ్రీధరా!
తండ్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్

తండ్రీ! దేవకిదేవి బిడ్డవయి స్వస్థానంబుబోనాడి, నీ
వాంద్రదం వీడి, కృపా. యోదిపయినబ్బాలామణిన్ రుక్మిణిన్
తీంద్రదం బందుచు, బెండ్లియాడి ప్రజలన్ నిత్యంబు గాపాడవే
తండ్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్

తండ్రీ! ఆఖరుమాట జెప్పదను నా దైవంబే నీవైన, ని
వ్వాంద్రా! సౌఖ్యములెల్ల నాకిపుడు, నింపారంగ ప్రార్థించి, పూ
దండ్రల్ గైకొని, పూజజేసెదను, బాధల్మాన్పి నన్నేలరా
తండ్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్

తండ్రీ! సుబ్బమ సుబ్బరామయకు, మోదంబొప్ప సత్పుత్రుడన్
తండ్రీ! పయ్యేడిపాటి వంశజుడ నేతత్పద్య పూమాలలన్
తండ్రీ! తావకకంఠసీమ నిడితిన్ ధన్యోస్మియంచెంచెదన్
తండ్రీ! సప్తగిరీంద్రవాస! దయలేదా! నేను మల్లార్యుడన్



# (గద్య)

ఇది శ్రీ మదుమా మహేశ్వర. కరుణా కటాక్ష. వీక్షణ ప్రసాద లబ్ధ. సహజకవిత్వ. రచనా. దురంధరాప స్తంభసూత్ర. శత మర్షణ గోత్ర పవిత్ర రత్న గర్భ. కర్పూర పేటి. పైడిపాటి వంశ వారాసి సంభవరాకా సుధాకర. సుబ్బాంబికా. సుబ్బరామార్యనందన మల్లన నామధేయ ప్రణీత. సప్తగిరీంద్రవాస శతకమునందు సర్వంబును సమాప్తము—



గ్రంథకర్త:

తేది 2-12-85 పైడిపాటి మల్లనకవి

# శోధన పట్టిక

| పద్యం నెంబరు | పద్యం పాదం నెంబరు | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 1 | విడి | నిడి |
| | 3 | డెప్పం | జెప్పం |
| 3 | 2 | రణ్య | రుణ్య |
| 5 | 3 | లేంద్రం | వేంద్రం |
| 12 | 4 | | |
| 27 | 2 | క్రోధంబేమియుఁ | సంకోచంబునుఁ |
| 47 | 2 | నెయ్యం | నెయ్యం |
| 51 | 3 | యత్తురు | యిత్తురు |
| 54 | 2 | రత్నాల | తద్రత్న |
| 59 | 2 | ఆంద్రుఁ | తంద్రుల్ |
| 64 | 2 | లొమ్మిది | ర్దొమ్మిది |
| 61 | 3 | నొకయుద్రంసీవు | ఉడుతఁ ఓదార్చి |
| 86 | 3 | వేగం | నీవే |
| 90 | 3 | వాదం | కోపం |
| 93 | 3 | నీలం | నోలిం |
| 85 | 1 | సద్రం | సంద్రం |
| 105 | 1 | బేలా | బేల |